# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర ఆశ్వయుజ బ॥ ౭
సోమవారము


## గ్వాలియరు రాజ్యాంగము

౧౯౩౯ వ సంవత్సరములో గ్వాలియరు సంస్థానములో రాజ్యాంగ సంస్కరణములు ప్రకాశమానమయ్యెను. ఆ సందర్భములో కొంతకాలము గడిచిన తర్వాత దానిలో వృద్ధికరమగు మార్పులను చేయుచుందుమని మహారాజాగారు వాగ్దానము చేసియుండిరి. తదనుగుణ్యముగా మహారాజాగారు విజయదశమీ సమావేశములో గ్వాలియరు రాజ్యాంగములో కొన్ని మార్పులు ప్రకటించిరి.

ఆదిలో ౧౯౩౯ లో గ్వాలియరు రాజ్యాంగము ప్రకటితమైనప్పుడు మేము విమర్శించియుంటిమి. ఇప్పుడు మరల కొత్త మార్పులైనందునను మన రాష్ట్రములోను యింతలో అనగా నాలుగైదేండ్లలోనైనను మన కొత్త రాజ్యాంగము కార్యరూపములోనికి రావచ్చుననుసూచనలుండుటచేతను సోదర దేశీ సంస్థానాలలో ఏమేమి రాజ్యాంగములు ప్రసాదితమగుచున్నవో అవెట్లు నడచుచున్నవో అందులో ఏమేమి మార్పులు ఎంతెంత కాలములో జరుగుచున్నవో వాటి స్వరూపము ప్రజలకేవిధముగా ఉపకరించునో ఆవిషయాలన్నియు మన రాష్ట్రవాసులు శ్రద్ధతో గమనించుచూ ఉండవలెనను దృష్టితో ఆ విషయమును గురించి మరల వ్రాయుచున్నాము.

మొట్టమొదటి గమనికయేమనగా ౧౯౩౯ లో ప్రసాదితమైన రాజ్యాంగములో రెండేండ్ల లోపలనే మార్పు జరిగినదను సంశయమైయున్నది. అచ్చట రెండు శాసనసభలున్నవి. ఒకటి ప్రజాసభ, రెండవది రాజసభ. ప్రజాసభలో ప్రజలచే ఎన్నుకొనబడినవారెక్కువగా ఉన్నారు. ఇదివరలో మొత్తము ౮౫ మందియుండిరి. అందు ౫౦ మంది ఎన్నుకొనబడినవారు. ఇప్పుడు మొత్తము సభ్యులు ౯౦ మందియుందురు. ఎన్నుకొనబడినవారు ౫౫ మందియుండగలరు ప్రభుత్వ నామకరణమైనవారు ౩౫ మంది ఉండగలరు. అనగా ౨౦ మంది ఎన్నుకొనబడినవారే ఎక్కువగా నుందురు. అంటే సభ్యులలో సంఖ్య ఎక్కువ అయిందన్న మాటయేకాని ఎన్నుకొనబడినవారికిని నామకరణమైన వారికిని మధ్య అంతరాయ మెప్పటివలెనే యున్నది. అంకెలు భేదించినా అభిప్రాయము భేదించలేదు. దీనివేరే రాజనీతి. ఏమొచ్చినట్లుండవలెను ఫలితము ఎప్పటినున్నగానే యుండవలెను. అయితే యీ ప్రజానియుక్త ప్రభుత్వనియుక్త సభ్యులయంతరాయము మన హైదరాబాదు రాజ్యాంగముకన్న ౧౧ అంకెలకంటె యెక్కువగా ఉన్నదని గమనింపవలెను.

మన హైదరాబాదులో రానున్న శాసనసభలో ఎన్నుకొనబడిన వారి సంఖ్య యెక్కువున్నది. (elected majority) అని స్పష్టాక్షరములతో మన ప్రభుత్వమువారు ప్రకటించినారు. ఎక్కువగా ఉన్నదయ్యాలంటే ౪౩ ఎన్నుకొనబడినవారు ౪౨మంది నామకరణము పొందినవారు అని తెలిపినారు. కాని లెక్కలు గుణించి చూచితే యీవిషయము తలక్రిందుగా ఉన్నది. నామకరణముపొందినవారే ౪౩ గురున్నూ ప్రజలచే —కాదుకాదు— వర్గాలవారిచే ఎన్నుకొనబడినవారు ౪౨ రున్నూ కనబడుచున్నారు ఈ సంగతిని మేము సంస్కరణ ప్రకటితమైననాడే యెత్తి చూపినాము. అయినా మేమైన లెక్కల గుణింతములో పొరపాటు పడితి మోయేమో అని తర్కించుకొనుచుంటిమి. సుప్రసిద్ధ రాజకీయ శాస్త్రపారీణులైన మామిడిపూడి వెంకట రంగయ్యగారు గతమాసపు ఇండియన్ పొలిటికల్ సైన్సు జర్నల్‌లో హైద్రాబాదు రాజ్యాంగ సంస్కరణములను గురించి ఒక విపులమైన వ్యాఖ్యవ్రాయుచు ఇట్లన్నారు.

"శాసనసభలో మొత్తము ౮౫ మంది సభ్యులుందురు. అందు ౪౨ సభ్యులు ఎన్నుకొనబడిన సభ్యులైయుందురు" హైద్రాబాదులో ఎన్నుకొనబడినవారు నామకరణము వారికంటే తక్కువ. గ్వాలియరులో ఎన్నుకొనబడినవారు నామకరణము వారికంటే ౧౦ మంది యెక్కువ. ఇది రెండవ ముఖ్య విశేషము.

గ్వాలియరులో రెండుశాసనసభలలోను సమానాధికారాలున్నవి. ఉభయ సభలును అంచెనాపట్టీని చర్చించి విమర్శించవచ్చును. ఇంకను ఉభయ సభలకిదివరలో యిచ్చియుండిన అధికారాలకంటె ఎక్కువ అధికారాలిచ్చినారట. ఆ వివరాలు మాకు తెలియరానందున అభిప్రాయమీయజాలము.

శాసనసభకు ఎన్నుకొన బడినవారు ౫౫ మంది సభ్యులుఅని చెప్పితిమి కదా ఈఎన్నికలెట్టివి, మతాలబట్టియా, ప్రత్యేక వరప్రసాదాలను బట్టియా, ధనాన్ని బట్టియా, గణిత శాస్త్ర సంబంధమగు గుణకారమును బట్టియా, లేక మండలాలనుబట్టియా? అనునది ముఖ్యముగా తెలుసుకొనదగినది. గ్వాలియరులో ఎన్నికలకొరకుగాను సంస్థానాన్ని ౫౦ భాగాలుగా విభాగించి ప్రతి భాగమునుండియు ఒకసభ్యుడు ఎన్నుకొనబడునట్లు నిర్ణయించినారు. అంటే అమెరికా, ఇంగ్లాండు, బ్రిటిషిండియాలో వర్తించునట్టి మాండలికపు (Territorial Basis) పద్ధతియని విశదమగుచున్నది. అది సహజపద్ధతి. అందు మతానికి తావులేదు. ఒక వర్గము వారిని దిగతీసి ఇంకొక వర్గమువారిని ఎగబెట్టి పరిపాలించుపద్ధతి కానేకాదు. అల్ప సంఖ్యాకులను అధిక సంఖ్యాకులనుగా చేసేపద్ధతి అంతకంటెకాదు.

గ్వాలియరులో ౫౦మంది మాండలిక ఛందములద్వారావత్తురు. మిగతా ౫౫గురిలో ౨జాగీర్దార్ల పక్షాన, ఒకడు కూలీవర్గపక్షాన, ఒకడు వ్యాపారుల(సాహుకార్ల) పక్షాన, ఒకడుపరిశ్రమలనడిపించువారి పక్షాన ఎన్నుకొనబడుదురు. అల్ప సంఖ్యాకులగు ముసల్మానులకును అబలలగు స్త్రీలకును కొన్నిస్థానాలు ఈ ౫౫ లోనే ప్రత్యేకించియుంచినారు. మొత్తముమీద ౩,౬౫,౦౦౦ ఎన్నుకొనువారై యుందురు. అనగా నూటికి ౧౭ మంది ఎన్నుకొను హక్కుకలవారై యుందురు. ఇది ఒకవిధముగా బాగానే యున్నది. వర్గీకరణపద్ధతి(Functional representation) కంటె ఎన్నో రెట్లు మేలైనట్టిది. రెంటికిని ఎచ్చటను కలయికయే యుండదు. ఒకటి పడమటికి నడిస్తే యింకొకటి తూర్పునకు నడుస్తూయుండును.

మన హైద్రాబాదు భావిరాజ్యాంగములో భారతదేశమందుకాని ఇంగ్లాండు, అమెరికా, ఫ్రాన్సు, స్విస్సు దేశము, హాలెండు, బెల్జియంవంటి దేశాలలో గాని లేనట్టి ఒకవిచిత్రపద్ధతి యేర్పాటు చేయబడింది. అదే వర్గపద్ధతి. మనకిక ముందు రాజ్యభారములో పాల్గొను శాసనసభ్య మహాశయులు సర్వ ప్రజల పక్షాన ఎన్నుకొనబడినవారుగా ఉండరు. వారు జాగీర్దారులు, వర్తకులు, వకీళ్లు, వైద్యులు, పెద్దపెద్దభూస్వాములు, కళాశాలల సంబంధముగల గ్రాజుయేట్లు, పరిశ్రమల యజమానులు, ఇట్టివర్గాల పక్షానయెన్నుకొనబడినవారుగా ఉందురు. వారిలోను సరాసరి సగము సగము వంతున హిందువులును ముసల్మానులును ఉందురు. ఈపద్ధతివలన వర్గద్వేషాలు, మతద్వేషాలు బాగా ప్రబలిపోవుటకు అవకాశం కలదనియు, ఇకముందుకాలములో ఇంకను మతకల్లోలాలు ఎక్కువైతే వమిన్నీ ఆశ్చర్యముండదనియు చెప్పుచున్నాము. బ్రిటిషిండియాలో వర్గపద్ధతిపై ఎన్నికలు లేకుండినను మధ్యకొంతకాలము మద్రాసువంటి రాజధానిలో బ్రాహ్మణేతరవర్గమేర్పడి ఎన్నికలుజరిగి ఒక్కొక్కపార్టీ అనేకలక్షల ద్రవ్యనష్టమున్నూ, అంతఃకలహాలున్నూ, పోటీలున్నూ విపరీతముగా జరిగి నూరకొలదికుటుంబాలు ప్రతిజిల్లాలోను నాశనమయ్యెను. ఒక్కశాసనసభలందేకాక తాలూకా జిల్లాబోర్డుల ఎన్నికలలోను మునిసిపాలిటీ యెన్నికలలోను అక్కడ యీకలహాలు చాలాచెలరేగియుండెను. మన హైద్రాబాదులో వర్గాలవారీగా ఎన్నికలుజరిగితే మతము పేరిట ప్రత్యేక హక్కులు ప్రత్యేకింపబడితే ఇక చెప్పవలసిన దేమున్నది,

అఖిలభారత ప్రసిద్ధివహించి రాజకీయసమస్యలందు అఖండ విజ్ఞానమును గడించి పేరొందినట్టి మామిడిపూడి వెంకట రంగయ్యగారు హైద్రాబాదులోని వర్గీకరణపద్ధతినిగురించి యిట్లువ్రాసినారు.

"ఈ పద్ధతి ఇటలీలో జన్మమెత్తింది. ఇది ఫ్యాసిస్టు సిద్ధాంతానికిని మూలాధారము. ఫ్యాసిస్టుతో కొంచమైన పరిచయముకలవారందరున్నూ దీనికిని ప్రజాపాలనవిధానానికినీ పెద్ద అఖాతము మధ్యనవర్పడిందని చెప్పగలరు.

ఇక మతవర్గీకరణ పద్ధతిపై ముసల్మానులకు సరాసరి సగముస్థానాలిచ్చిన విషయమునుగురించి ఆచార్య శ్రీ వెంకట రంగయ్య ఎంతులుగా ఇట్లభిప్రాయమిచ్చినారు.

"హిందువులు నూటికి ౮౫ ప్రకారమున్నారు. ముసల్మానులు నూటికి ౧౧ మందియే యున్నారు. కొన్నిజిల్లాలలో ముసల్మానులు నూటికి ౭ మంది లేక ౮ మందికూడా లేరు. అట్లున్నను వారికి హిందువులతోపాటిగా సరాసరి సమానస్థానాలిచ్చినారు. క్రైస్తవులకును పార్సీలకునుకూడాఅనుగ్రహము చూపితే అధిక సంఖ్యలో ఉండే హిందువులు శాసనసభలో అల్ప సంఖ్యాకులైపోతారు. హైద్రాబాదుముసల్మానుల కిచ్చినట్టి ప్రత్యేక ప్రాముఖ్యతవంటి అల్ప సంఖ్యాక ప్రాముఖ్యత మరెచ్చటను కానరాదు"

ఈ కారణాలనుబట్టి గ్వాలియరు రాజ్యాంగములో మాండలిక ఛందక పద్ధతి (Territorial election) చాలా యుత్తమమైనదని ఎవరైనాసరే నిష్పక్షపాతబుద్ధికలవారును మతపక్షపాతవర్జితులును తప్పకుండా చెప్పగలరు.

ఈ హద్దువరకు గ్వాలియరు సంస్థాన రాజ్యాంగాభివృద్ధి ప్రశంసనీయమైయున్నది.

---

### దసరాఉత్సవము ఆపివేయబడుట

(ఒకవిలేఖరి)

నల్లగొండ, అక్టోబరు ౪

ఇచట ప్రతిసంవత్సరము దసరాఉత్సవము అర్యసమాజభవనమునుండి ఘనముగా యుక్తంగాపల్లి భజనలతో సాయంత్రముగా వెడలి రామగిరిచేరి, దేవాలయమండపమున సాయంకాలాలుకలగునవి జరుపబడి పండితులయుపన్యాసములు కూడా జరుగుచుండెడివి. ముసీదుల పక్కనుండి పోవునప్పుడే కాని వచ్చునప్పుడే కాని శ్రీబజంత్రీ మసీదులవద్ద ఈ రీతిగా వాద్యము ఆపివేయబడుచుండెను నేటివరకుయున్నదు కాని స్థానిక మహమ్మదీయులు ఆక్షేపణచేయలేదు. ఈసంవత్సరం దసరాసందర్భమున నారంరోజులకుముందే స్థానిక ఆర్యసమాజంవారు తహశీలుఆఫీసుకు ఉత్సవవిషయమైతెల్పిరి, దానిపై స్థానిక తహశీలుదారు మసీదులవద్ద భజనలుజరుపుటకువీలుకాదని, ఆయుధములుకూడా ధరించకూడదని నిర్బంధముపెట్టుచు ఆజ్ఞనొసంగిరి, అందుపై ఆర్యసమాజపుమంత్రిగారును మరియు స్థానిక కాంగ్రెసుముఖులును యథాప్రకారం ఉత్సవమునడుపుకొనుటకు ఆజ్ఞయియ్యవలెనోరిరి. దానిజవాబు విజయదశమినాడు ౧౧ గంటలకు తహశీలునుండి ఆర్యసమాజపుమంత్రిగారిపేర ఒక ఆజ్ఞ పంపబడెను. అందులో ఈవిధంగా వ్రాయబడియున్నది: "మసీదులవద్ద భజనలు చేయకుండా ఆయుధములను ఏవిధంగా అనవసరంగా ఉపయోగించకుండా ఆర్యసమాజమంత్రిగారు సంపూర్ణ బాధ్యతవహించవలయును" అని ఆజ్ఞయివ్వబడెను, పైఆజ్ఞపై స్థానికహిందువులు అసమ్మతితెల్పను సభాభవనంలో శ్రీబోయినపల్లివెంకటరావువకీలు గారి అధ్యక్షతన సభజరిపిరి తహశీలుదారుయిచ్చినఆజ్ఞపై అసంతృప్తితెలుపుచుఘనంగా ఉత్సవము జరుపుటకు తీర్మానించిరి. సభలోను మూడు వేయిమంది పాల్గొనిరి. దీనిఅపీలు తాలూకాదారుగారివద్ద ఆర్యసమాజమువారు చేయనున్నారని తెలియుచున్నది.

---

### ఒకవర్ణాంతరవివాహము

(ఒకవిలేఖరి) ౭-౧౦-౪౧

సికింద్రాబాదు, చిట్టిబజారు కీ॥ శే॥ అన్నాసామి మొదల్యారిగారి కాంపౌండులోనుండు సికిందరాబాదు ఆర్యసమాజపక్షమున ౧౨ అక్టోబరు సాయంకాలము ౫గంటలనుండి ౬-౩౦ వరకు వైదికరీత్యా వివాహసంస్కారము జరిగెను.

వరుడు- శ్రీయుతమన్మథరావు రైల్వేఆడిటు ఆఫీసులో క్లార్కు, బ్రాహ్మణయువకుడు.

వధువు-శ్రీమతిజానకీబాయి ఆంధ్రకన్య. వివాహసంస్కారమును శ్రీ దుర్గాపండితులు లక్ష్మయ్య, రాజరత్న రామాచార్యులు జరిపిరి.

---

### చంద్రోదయ వార్త

మహమ్మదీయులకు చంద్రోదయముతో చాలాపండుగలు సంబంధముకలవైయున్నవి. కావున ఆట్టి చంద్రోదయవార్తను హైద్రాబాదు సుతలాఖవారు సర్వముసల్మాను దేశాలకు తంతీలద్వారాపంపుటకై ఏర్పాటుచేయవలెనని ఫర్మాను ఆయినదని వినవచ్చుచున్నది.

---

### హైదరాబాదు బజారు ధరలు

తేది ౬-౧౦-౫౧ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లచొప్పున ధరలన్నీ హాలీతో.

| వస్తువులు | పల్లా ౧కి ధర | | | |
|---|---|---|---|---|
| | రూ | అ | పై | |
| కిచిడి సాంబర్లు | ౨౩ నుండి | ౨౪ | | |
| సంబర్లు | ౨౩ | ౦ | ౦ | |
| ఢిల్లీసాంబర్లు | ౨౨ | ౮ | ౦ | |
| రాంసాగర్లు | ౨౦ | ౮ | ౦ | |
| సామ్రాం | ౨౦ | ౪ | ౦ | కొత్తవి |
| | ౨౨ | ౦ | ౦ | పాతవి |
| అక్కాటి | ౨౧ | ౮ | ౦ | ౨౧౪ కొత్తవి |
| ,, | ౨౨ | ౮ | ౦ | పాతవి |
| కోనామణి | ౨౦ నుండి | ౧౯౪ వరకు | | |
| బియ్యములు | ౧౩ | ౦ | ౦ | |
| దేశావళి | ౨౦ | ౦ | ,, | ౧౮ వరకు |
| గోధుమలు | | | | |
| షర్బతి | ౨౧ | | ౨౦౪ | |
| బన్సి | ౨౦ | ౦ | ౦ | ౧౯౪ వరకు |
| అమ్మకీ | ౧౯ | ౦ | ౦ | |
| పోటీయా | ౧౮ | ౮ | ౦ | |
| ఎర్రగోధుమలు | ౧౬ | ౮ | ౦,౧౩ | |
| జొన్నలు | | | | |
| తెల్లజొన్నలు | ౧౦౪ నుండి | ౯౪ | | |
| పచ్చజొన్నలు | ౮ | ౮ | ౦ | |
| మడికట్టు జొన్నలు | ౮ | ౮ | ౦ | |
| శెనగలు | ౧౬౪ వరకేకి | ౧౬౪లేకి | | |
| కందులు రొమ్మురవి | ౯ | ౮ | ౦ | |
| మినుములు | ౧౨ | ౦ | ౦ | |
| అంకెలు | ౧౪ | ౪ | ౦ | |
| సజ్జలు | ౯ | ౦ | ౧ | |
| పప్పులు | | | | |
| శెనగ పప్పు | ౨౩ | ౦ | ౦ | |
| కంది ,, | ౧౬ | ౮ | ౦ | |
| సిరిసెనగ ,, | ౨౧ ౨౨ | ౮ | ౦ | |
| అంక ,, | ౧౮ | ౧ | ౦ | |
| మినప ,, | ౧౮ | ౦ | ౦ ౧౩౪ | |
| పెసర ,, | ౧౯ | ౦ | ౦ | |
| బెల్లం ,, | ౧౫ నుండి | ౧౬ వరకు | | |
| ఉప్పు | ౧౨, ౧౧ | ౮ | ౦ | |
| వుల్లిగడ్డ | ౧౬ నుండి ౧౯, | కొ। ౧౧౪ | | |
| వరుసమంచిది | ౨౧ ను. ౧౨వరకు | ౩౨-౨౮కో. | | |
| చక్కెర మణుము [౪౦ సేర్లు] | | | | |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ | |
| బొంబాయి ,, | ౧౩ | ౧౪ | ౦ | |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౦ | |
| నిజామాబాదు ,, ,, | ౧౩ | ౧౨ | ౦ | |
| ఎర్రచక్కెర, పల్ల | ౧౩, నుండి | ౧౫ వరకు | | |
| దర్గచక్కెర ,, ౪౦ సే. | ౧౬ | ౧౨ | ౦ | |
| ఎల్లిగడ్డ మణుము ౧౨ సే. | ౫ | ౮ | ౦ | |
| అల్లం ,, ,, | ౪ | ౧౨ | ౦ | |
| మణుము ౧౨ సే. | | | | |
| కొబ్బెరనూనె ,, | ౫ | ౧ | ౦ | |
| కుసుమనూనె ,, | ౫ | ౦ | ౦ | |
| నువ్వులనూనె ,, | ౪ | ౦ | ౦ | |
| వేరుసెనగనూనె ,, | ౩ | ౪ | ౦ | ౩ ౬ ౦ |
| కిరోసిన్ (గ్యాస్) ,, డబ్బా ౧కి | ౪-౧౨-౦ | | | |
| నెయ్యి మణుము ౪౦ సేర్లు | | | | |
| బీదరు నెయ్యి ,, | ౬౫ | ౦ | ౦ | |
| తెలంగాణా ,, | ౫౫ | ౦ | ౦ | ౫౦ |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ | ౬ | ౦ | |
| బంగారు తు॥ ౧కి | ౫౦ | ౪ | ౦ | |
| వెండి ౧౦౦ తు | ౬౨ | ౮ | ౦ | |
| ,, తు ౧కి | ౦ | ౧౧ | ౬ | |
| సవరన్ ౧కి హాలి రూ- | ౩౩ | ౮ | ౦ | |
| మారకం | | | | |
| హాలీకి కల్దార్లు | ౧౫ | ౧౩ | ౬ | |
| కల్దారుకు హాలీలు | ౧౫ | ౧౧ | ౬ | |
| అముదాలు బస్తా ౯, | ౯ | ౮ | ౦ | |
| వేరుశెనగ ,, | ౫ | ౪ | ౦ | |
| బుడ్డలు పల్లా ౧కి | ౮ | ౪ | ౦ | |
| పప్పు ,, | ౧౨ | ౦ | ౦ | |

గమనిక:-

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకారు,

---

### రాజారామ మోహనరాయల వర్ధంతి

ఈవర్ధంతిసభ హైదరాబాదు (దక్కన్)నగరంలో హనుమాను టేకిడి బ్రహ్మసమాజమందిరమందు - క్రొంబరుచవ తేదిన శ్రీఖండే గారిఅధ్యక్షతనజరుపబడెను. సత్తూరుసత్యనారాయణ రావుగారు, జి-ఏ-చందావర్కర్ గారు రాయలవారి జీవితచరిత్రనుగురించియు, వారిసాంఘిక సేవనుగురించియు ఉపన్యసించిరి.

